## పతాకహస్తవినియోగము

వ. మఱియు నాట్యారంభమందు, మేఘమందు, వలదనుటయందు, నిశియందు, వాయుస్పర్శంబులయందు, సమరబృందములఁ జూపుటయందుఁ, దరంగంబులయందు, ఖడ్గములయందుఁ, దాపములయందు, ధారణియందు, నాశీర్వాదములయందుఁ, దాననుటయందు, నక్కడక్కడననుటయందు, శపథంబునందు, శయనంబునందుఁ, [1]దాళపత్రములయందుఁ, [2]బ్రతాపంబునందు, ఫలద్రవ్యాదిస్పర్శంబులయందు, నశ్వమందు, ఖండించుటయందు, నంబుధియందు, దొడ్డవార లనుటయందు, దొరలయందు, దినమాసవర్షసూచనలయందుఁ, గవాటంబులు మూసి తెఱచుటయందుఁ, బొమ్మనుటయందు, శ్లాఘించుటయందు, నంగాదిస్పర్శంబులయందు, సనుమనుటయందు, సప్తవిభక్తులతెఱంగుం జూపుటయందుఁ, బ్రసాదంబు గైకొనుటయందుఁ, గరతాడనంబులయందుఁ, బీఠంబులయందు, మానినీమణులకుచస్థలిం బట్టుటయందుఁ బతాకహస్తంబు వర్తించుచుండు, నంత 5

## త్రిపతాకహస్తలక్షణము

క. మఱియును సపతాకంబుగ
వరుస ననామికపుఁవ్రేలు వంచిన నదియుక్
ఇరవుగఁ ద్రిపతాకం బని
గరిమను జెలువొందుచుండుఁ గస్తూరిరంగా! 6

## త్రిపాతాకహస్తవినియోగము

సీ. వెలయుచుండుఁ గిరీటవృక్షంబులకు మఱి
పాకశాసనునకు బాణమునకు
మొగిలిపుష్పానకు మొనయుచెక్కిళ్లకు
మెలఁగు వహ్నిజ్వాలమెఱుపులకును
దనరువజ్రాయుధంబునకు దీపమునకు
నేపు మీఱఁగఁ ద్రిప్పిచూపుటకును

1. తాళపత్రములను గుఱించి చెప్పుటయందు. 2. ప్రతాపమునుగూర్చి పలుకునప్పుడు.
"తాళపత్రే చ వేషేచ ద్రవ్యాదిస్పర్శనే తథా" "ప్రతాపేచ ప్రసాదేచ చంద్రికాయాం ఘనాతపే"
(చూ: సం. అభినయ. 212, 210 శ్లో.)

బరమేశ్వరునకును బద్మనాభునకును
సొరిదిఁ బ్రకాశంబుఁ జూపుటకును

గీ. వేడ్క రతికేళి మఱి కూడి వీడుటకును
నిన్ని తావుల వర్తించి చెన్ను మీఱు
నిలను ద్రిపతాకహస్తంబు సింధురేశ!
రాక్షసవిరామ! కస్తూరిరంగధామ! 7

## అర్ధపతాకహస్తలక్షణము

గీ. ఎనయఁ ద్రిపతాకహస్తమందునఁ గనిష్ఠ
వ్రేలు గూరిచి వంచిన వివరమునను
ధరణిలోఁ జూడ నర్ధపతాక మయ్యె
రాక్షసవిరామ! కస్తూరిరంగధామ! 8

## అర్ధపతాకహస్తవినియోగము

గీ. చిగురుకును [1]ఛురికకు ధ్వజశృంగములకు
రమణినుదుటికి రెంటికి నంపమునకు
వచ్చు నర్ధపతాకంబు వైపు మీఱ
రాక్షసవిరామ! కస్తూరిరంగధామ! 9

## కర్తరీముఖలక్షణము

గీ. అరయ నర్ధపతాకంబునందు మిగులఁ
దర్జనిక వ్రేలు వెలిగాను దాఁచి యున్నఁ
గర్తరీముఖహస్త మై ఘనత కెక్కు
రాక్షసవిరామ! కస్తూరిరంగధామ! 10

## కర్తరీముఖహస్తవినియోగము

చ. మరణము భేదమున్ మెఱుపు మాటికినిం గడకంటిదృష్టియున్
వెరవుగఁ దల్లక్రిందులును వేదనచేఁ దమిచేతఁ బొర్లునున్
నిరతము దీఁగె లల్లుకొను నేర్పును వచ్చిన నిన్ని తావులన్
వరుసగఁ గర్తరీముఖము వైపుగఁ గస్తూరిరంగనాయకా! 11

---

1. "క్రకచే ఛురికాయాంచ ధ్వజే గోపుర శృంగయోః" (సం. అభినయ, 286 శ్లో.)

## మయూరహస్తలక్షణము

గీ. మెఱయ సంశ్లిష్టమున ననామికను గూర్చి
కడమ వ్రేళ్లను జాచిన ఘన మయూర
హస్త మనుపేర విలసిల్లు నవనిలోన
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 12

## మయూరహస్తవినియోగము

చ. నెమలిని దీగె లల్లుటను నిక్కముగా శకునంబుఁ జూడనున్
రమణులు కాటుకుంచుటను రమ్యముగా మఱి బొట్టుపెట్టుటం
గ్రమముగ వాంతిచేయుటను గ్రమ్మఱఁ జూడఁగ నిన్ని తావులం
దమర మయూర మై వెలయు నన్నిటఁ గస్తురిరంగనాయకా! 13

## అర్ధచంద్రహస్తలక్షణము

క. ఇరవుగ నపతాకంబును
సరసను సంశ్లిష్ట మొనయఁ జాచిన నదియున్
మఱి యర్ధచంద్రహస్తము
గరిమను జెలువొందుచుండుఁ గస్తురిరంగా! 14

## అర్ధచంద్రహస్తవినియోగము

సీ. సారెకుఁ గృష్ణపక్షాష్టమిశశిఁ జూపఁ
జెక్కిటఁ జెయ్యుంచి చింతపడను
నడుము వట్టుటకును మెడఁబట్టి నూకను
ధ్యానంబు సేయను దాన యనను
భల్లాయుధమునను బ్రార్థించుటను మఱి
చెలువొంద రామ రాఁ జేయుటకును
భుజము దట్టుక జెట్లు పోట్లాడఁ జూడను
సొంపుగా నమరులఁ జూపుటకును

గీ. జేరి యభిషేకమును వేడ్కఁ జేయుటకును
నరయఁగా నిన్ని తావుల నర్ధచంద్ర
హస్త మది వచ్చు నిదె చూడు మంబుజాక్ష!
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 15

## అరాళహస్తలక్షణము

గీ. అనువుగాఁ జూడనుపతాకహస్తమునను
దర్జనిక వంచిపట్టిన ధర నరాళ
హస్తమయి చాలవేడ్కఁగా నతిశయిల్లు
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 16

## అరాళహస్తవినియోగము

క. ఇరవుగ నాచమనీయముఁ
బరువడి సుడిగాలి నమృతపానంబుననున్
మఱి విషపానము సేయను
గరిమ నరాళంబు వచ్చుఁ గస్తురిరంగా! 17

## శుకతుండహస్తలక్షణము

గీ. అరసి చూచిన మురహరి! మఱి యరాళ
నామకరమందు వంప ననామికంబు
నదియె శుకతుండహస్తమై యవని వెలయు
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 18

## శుకతుండహస్తవినియోగము

గీ. పరఁగుకుంతాయుధమునకు బాణమునకు
మఱియు మర్మము భేదించుమార్గమునకు
మెచ్చ శుకతుండహస్తమె వచ్చుఁగాదె
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 19

## ముష్టిహస్తలక్షణము

గీ. పరఁగ వ్రేళ్లన్ని మఱి గూర్చిపట్టియున్న
ముష్టిహస్తం బదే యండ్రు మోహనాంగ!
భానుసంకాశ! నతజనభయవినాశ!
రాక్షసవిరామ! కసురిరంగధామ! 20

## ముష్టిహస్తవినియోగము

చ. స్థిరముగ జుట్టు పట్టుకొని జెట్టిదె యుద్ధముచేయ నందునన్
నిరతము దారహారములు నేర్పుగనున్ గళమందు వేయనున్
గరిమను దట్టిచే నడుముగట్టను దన్నెదిరించు వారలం
బరఁగను గొట్ట ముష్టి యిదె వచ్చును గస్తురిరంగనాయకా! 21

## శిఖరహస్తలక్షణము

గీ. ముష్టిహస్తాన నంగుష్ఠ మూర్ధ్వముగను
జెలువు మీఱఁగ నెత్తిన శిఖర మౌను
సరసగుణహార! శ్రీరంగపురవిహార!
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 22

## శిఖరహస్తవినియోగము

సీ. వెడవిల్తునికి మఱి విలువట్టుటకును నా
లింగనంబునకును లింగమునకుఁ
జెలువొందు గోపురశృంగంబుఁ జూపను
నిది నిశ్చయంబన నేమి యనను
బేర్మి దంతముఁ జూపఁ బితృతర్పణమునకుఁ
గంబమునకు నధరంబునకును
ఘంట వాయింపను గాదని పల్కను
నెదిరిని నొడి వట్టి యాడ్చుటకును

గీ. బరఁగ శ్రేష్ఠంబు ననుటకు భయమునకును
శిఖరహస్తంబు వచ్చును జెన్ను మీఱ
సరసగుణహార! శ్రీరంగపురవిహార!
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 23

## కపిత్థహస్తలక్షణము

చ. తగవుగ ముష్టిహస్తమునఁ దర్జని వ్రేలిని నెత్తి వంచియు
న్నగడుకనిష్ఠకన్ వెలిగ నేర్పునఁ గొంచెము వంచిపట్టినం
బొగడఁ గపిత్థహస్త మయి పొందుగ ధారణిలోఁ జెలంగు నో
నగధర! వాసుదేవ! యదునందన! కస్తురిరంగనాయకా! 24

## కపిత్థహస్తవినియోగము

చ. ఇరవుగ లక్ష్మివాణులకు నింపుగఁ దాళము వట్టునందుకుం
బరఁగను బాగ సుట్టుటకుఁ బాలను బిండను గొంగువట్టనుం
దిరముగఁ బూలు సుట్టఁగను దీపము ధూపముఁ జూపఁ జెల్లకున్
మెఱయఁ గపిత్థహస్త మగు మేల్మిని గస్తురిరంగనాయకా! 25

## కటకాముఖహస్తలక్షణము

ఉ. చేరినముష్టిహస్తమునఁ జెన్నుగ మధ్యపువ్రేలిక్రిందుగాఁ
గూరిమి బొట్టవ్రేలి సదె గ్రుచ్చుక తక్కినవ్రేళ్లు చేరిసన్
వారిజనాభ! యింక విను వైపుగనుం గటకాముఖంబు నా
సారెకుఁ దేజరిల్లు నిలఁ జక్కని కస్తురిరంగనాయకా! 26

## కటకాముఖహస్తవినియోగము

చ. నిరతము వజ్రముష్టికిని నేర్పున బాణము నేయ నంగడాల్
గరిమను బట్టి యెత్తుటకు గట్టిగ నాజముధాటిపోటకుం
దిరముగ వచ్చు నిందులను దేవర! యీకటకాముఖంబు దాఁ
గరివరదాప్రమేయ! భవఖండన! కస్తురిరంగనాయకా! 27

## సూచిహస్తలక్షణము

గీ. పరగఁ దర్జనివ్రేలిని జాఁచిపట్టి
కడమవ్రేళ్ళను మడఁచిన గట్టిగాను
సూచిహస్తం బనంగను సొంపు మీఱు
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 28

## సూచిహస్తవినియోగము

సీ. పరఁగ నొక్కటి పరబ్రహ్మంబు ననుటకుఁ
జామరంబునకును జగతి యనను
నినునికి నూటికి నిది యది యనుటకు
జడకు ఛత్రంబు కాశ్చర్యమునకు

కానికానీ యని మేను సూపుఁ కును
నిలలోన భేరి వాయించుటకును
కొనలు సూపుటకును గూర్మి సలాముకుఁ
జిక్కి పోవుటకును మురుక్కనకును
గీ. గట్టివా డనుమెచ్చుకు గరిమ మీఱ
సోఁది నూగారుబారులఁ జూపుటకును
సూచిహస్తంబు వచ్చును సొంపు మీఱ
రాక్షసవిరామ ! కస్తురిరంగధామ ! 29

## చంద్రకళాహస్తలక్షణము ; వినియోగము

గీ. మొనసి తర్జనికాంగుష్ఠములను జాఁప
నవనిఁ జంద్రకళాహస్త మగును మిగుల
విదియచంద్రుని కిది చెల్లు విమలచరిత !
రాక్షసవిరామ ! కస్తురిరంగధామ ! 30

## కోశహస్తలక్షణము

గీ. వెలయ విరళంబుగా నైదుఁ వ్రేళ్లు సాఁచి
కొనలుఁ గొంచెము వంచినఁ గోశ మగుచు
సరసగుణహార ! శ్రీరంగపురవిహార !
రాక్షసవిరామ ! కస్తురిరంగధామ ! 31

## కోశహస్తవినియోగము

చ. అనిశము పుట్టకుం బరఁగు నంతటఁ జెట్లకు స్వల్పభోజనం
బునకును బూలబంతులకుఁ బొందుగ ముగ్ధలు చెండ్లు చూపనున్
బనుపడఁ బూలబుట్టకును బాగుగ వడ్డన చేయుగిన్నెకు
న్నెనయును గోశహస్త మిల నింపుగఁ గస్తురిరంగనాయకా ! 32

## సర్పశీర్షహస్తలక్షణము

గీ. అరయఁ దొలుతటిసపతాకహస్తమునకుఁ
గొంచెముగ వ్రేళ్ళనన్నిటి వంచియుండ
నిలను మఱి సర్పశీర్షమై చెలువు మీఱు
రాక్షసవిరామ ! కస్తురిరంగధామ ! 33

## సర్పశీర్షహస్తవినియోగము

సీ. [1]చందనంబునకును సర్పంబునకు మఱి
మెల్లగా ననుటకు మే లనంగఁ
బ్రోక్షింప మిక్కిలి పోషింప దేవాది
తర్పణాలకు నీళ్లు ద్రాగుటకును
హస్తికుంభస్థలం బందుఁ దట్టుటకును
దగ జెట్లు భుజములు దట్టుటకును
శాంతుఁడు ననుటకుఁ జల్లన యనుటకు
సాబాసు మంచిది చాలు ననను

గీ. సర్పశీర్షంబుహస్తంబు సరవిగాను
నిన్నితావుల వర్తించు నింది రేశ !
సరసగుణహార ! శ్రీరంగపురవిహార !
రాక్షసవిరామ ! కస్తురిరంగధామ ! 34

## మృగశీర్షహస్తలక్షణము

గీ. అరయఁగా సర్పశీర్షంపుహస్తమందుఁ
గూర్మిఁ గొనవ్రేలు మఱియు నంగుష్ఠ మమర
దాఁప మృగశీర్షహస్త మై తనరుచుండు
రాక్షసవిరామ ! కస్తురిరంగధామ ! 35

## మృగశీర్షహస్తవినియోగము

సీ. పడతులు చెక్కిళ్లఁ బసుపు పూయుటకును
రాజీవనేత్ర మర్యాద యనను
వచ్చెదు ననుటకు వాదంబు సేయను
పోఁ కోర్చుకొన గోడఁ జూపుటకును
నెదు రెదు రనుటకు నిల్లు సూపుటకును
నొనరఁగాఁ బిలువను నుండు మనను
మఱి ముగ్గు వెట్టను దిరుగాడుటకు నింకఁ
జేర్చిఁ ద్రిపుండ్రంబు వెట్టుటకును

1. 'చందనే భుజగే మందే ప్రోక్షణే పోషణాదిషు।దేవర్ష్యుదకదానేషుహ్యాస్ఫాలే గజకుంభయోః॥
ంజాస్ఫాలేతుమల్లానాం యుజ్యతే సర్పశీర్షకః'. (సం. అభినయ, 828 శ్లో.)

గీ. బరఁగఁ బదములు ప్రియమునఁ బట్టుటకును
వెలయ [1] బరిచీలు వట్టను వేడ్కఁగాను
నెనసి మృగశీర్షహస్తమై తనరుచుండు
రాక్షసవిరామ ! కస్తురిరంగధామ ! 36

## సింహముఖహస్తలక్షణము

గీ. మఱి యనామిక యంగుష్ఠమధ్యములుఁ
గూర్చి మిగిలినవ్రేళ్లను గువలయేశ !
చాఁచినను సింహముఖ మయి జగతి వెలయు
రాక్షసవిరామ ! కస్తురిరంగధామ ! 37

## సింహముఖహస్తవినియోగము

గీ. ఆజ్యహోమంబునకుఁ బిల్లియస్థులకును
జింక కుందేలు వ్యాఘ్రంబు సింహములకు
నెలమి మఱి సింహముఖ మయి వెలయుచుండు
రాక్షసవిరామ ! కస్తురిరంగధామ ! 38

## లాంగూలహస్తలక్షణము

క. మఱి పద్మకోశమందున
వరుస ననామికవ్రేలు వంచిన మఱియుఁ
నిరతము లాంగూలం బన
గరిమను జెలు వొందుచుండుఁ గస్తురిరంగా ! 39

## లాంగూలహస్తవినియోగము

సీ. చేమంతిపూలకుఁ జెలఁగిన యలనిమ్మ
పండ్లకు మఱి చిన్నచెండ్ల కమరు
చిన్నిఘంటలకును గన్నేరుపూలకుఁ
బొనరఁ బోకలకును బుంటలకును

1. బరిచీ- ఈఁటె. "పరశుపట్టిసముల బాకుల వాడి, బరిచీల నురు గదా ప్రముఖాయుధముల" (సారం ౨ - భా.)

బొన్నకాయలకును బొడ్డుమల్లెలకును
గుండలంబులఁ జూప మెండుగాను
జిన్నిగిన్నెలకును సున్నపుఁగాయకు
సారిది సుగంధంబు సూపుటకును

గీ. మెఱయు మఱి యిన్నితావుల గరిమ మీఱి
యిలను లాంగూలహస్తంబు నిందిరేశ !
సరసగుణహార ! శ్రీరంగపురవిహార !
రాక్షసవిరామ ! కస్తురిరంగధామ ! 40

### [1] పద్మకోశహస్తలక్షణము

గీ. వెలయ మఱి యైదువ్రేళ్ళును విరళములుగఁ
బట్టి మేలుగ వంచిన దిట్టముగను
బద్మకోశంబు సుమ్మది పద్మనాభ !
రాక్షసవిరామ ! కస్తురిరంగధామ ! 41

### పద్మకోశహస్తవినియోగము

సీ. చక్రవాకములకుఁ జాతకంబులకును
గోమరొప్ప గుంటకుఁ గొప్పునకును
వెలఁగపండ్లకు నింక వెలఁదిపాలిండ్లకుఁ
బండ్లకు గజనిమ్మపండ్లకమరు
పూర్ణచంద్రునికిని బురికిని మేడకు
సొగసుకు నెమ్మోముఁ జూపుటకును
దామరపూలకుఁ దనరుపట్నమునకు
దేవళంబులకును దేరులకును

గీ. జెలఁగఁ [2] గలకలశబ్దంబుఁ దెలుపుటకును
మంచిసౌందర్యమునకు శ్లాఘించుటకును
బద్మకోశంబు వచ్చును బాగు మీఱ
రాక్షసవిరామ ! కస్తురిరంగధామ ! 42

---

1. దీనినే "సోలపద్మహస్తము"నుగాను వ్యవహరింతురు. "కనిష్ఠాద్యావర్తితాశ్చే ద్విరళాః సోలపద్మకః". (సం. అభి. 355 శ్లో).

2. "........తటాకే శకటే చక్రవాకే కలకలారవే। శ్లాఘనే సోలపద్మశ్చ కీర్తితో భరతాగమే" (సం. అభినయ. 357 శ్లో.)

## చతురహస్తలక్షణము

ఉ. సారెఁ గనిష్ఠికాంగుళిని జాఁచియుఁ దక్కిన మూఁడు వ్రేళ్లనుం
గూరిమి మీఱఁ గూర్చి యది కొంకక మధ్యపు వ్రేలి క్రిందుగాఁ
జేరినబొట్టవ్రేలి నిలఁ జెన్నుగ వంచియుఁ బట్టి చూపఁగా
నారమణీయ మౌ చతురహస్తము గస్తురిరంగనాయకా! 43

## చతురహస్తవినియోగము

సీ. అనువుగాఁ గస్తూరి యనుటకుఁ జెలువొందు
మద్దసాలకుఁ జెమ్మకు సరవి నమరుఁ
మఱియు సువర్ణతామ్రాదిలోహములకు
వరలు నానావిధవర్ణములకు
కొంచెమం చనుటకుఁ గొనుకొప్పుఁ గంటికిఁ
దోలఁగ రసానకుఁ దునుకలకును
దగవుగా నింతమాత్రంబు మెల్లన యనఁ
బరువడి ఘృతతైలపాత్రములకు

గీ. కాంతసడలకు మఱి హంసగమనములకుఁ
జతురహస్తంబు నచ్చును సరవి మీఱ
సరసగుణహార! శ్రీరంగపురవిహార!
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 44

## భ్రమరహస్తలక్షణము

గీ. పొనర నంగుష్ఠమధ్యమములను గూర్చి
గరిమఁ దర్జని వంచుక కడమువ్రేళ్ళు
చాఁచినంతనె భ్రమరహస్తంబు నగును
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 45

## భ్రమరహస్తవినియోగము

గీ. పరఁగ నిలుకోనఁ జెన్నొందు భ్రమరమునకు
నరయఁ గోకిలకును జెల్లు నమరవంద్య!
భ్రమరహస్తంబు మిక్కిలి భావమలగ
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 46

## [1] హంసహస్తలక్షణము

గీ. కొమరు మీఱఁ దర్జనిక యంగుష్ఠ మమరఁ
జేర్చి మిగిలినవ్రేళ్ళను జెన్నుమీఱఁ
జాఁప నది హంసహస్త మై చాలియుండు
రాక్షసవిరామ ! కస్తురిరంగధామ ! 47

## హంసహస్తవినియోగము

చ. చెలువుగఁ బూలు గోయఁగను జిత్రము వ్రాయఁగఁ బొట్టు గట్టఁగా
నిల నుపదేశమున్ దెలుప నింపుగ హంసకుఁ [2] బుల్కరింపఁగాఁ
బలుమఱు వాసుదేవపదపద్మము ధ్యానము చేయ నందునుం
దలకొను హంసహస్త మిది తథ్యము గస్తురిరంగనాయకా ! 48

## హంసపక్షహస్తలక్షణము

గీ. చెలువు మీఱఁగ మఱి సర్వశీర్షమందు
సగఁ జిటికెనవ్రేలిని జాఁచియున్న
హంసపక్షం బటంచని యవని వెలయు
రాక్షసవిరామ ! కస్తురిరంగధామ ! 49

## హంసపక్షహస్తవినియోగము

చెలువుగ నేటికట్టకును జెన్నుగ వారిధి గోడఁ జూపనుం
బలుమఱు సేతువందు మఱి బాగుగ [3] నా అని లెక్కపెట్టనున్
సలలితకీర్తి నాకనకు శాంతిని జేయుటయందు మిక్కిలిం
జెలఁగును హంసపక్ష మిలఁ జెన్నుగఁ గస్తురిరంగనాయకా ! 50

---

1. ఈహంసహస్తమనకే 'హంసాస్యహస్త'మనియుఁ బేరు. "మధ్యమాద్యాస్త్రయోఽఙ్గుళ్యః ప్రసృతా విరళా యది॥ తర్జన్యఙ్గుష్ఠసంయోగే హంసాస్యకర ఈరితః." (సం. అభి. 379, 380 శ్లో.)

2. "రచనేయావశాదీనాం పులకే మాక్తికేమణౌ । వేణువాదే సంయుతశ్చ ధ్యాననాయాం నిజాత్మని" (సం. అభి. 387 శ్లో).

3. "షట్సంఖ్యాయాం సేతుబంధే నఖరేఖాఙ్కనే తథా । విధానే హంసపక్షోఽయం కీర్తితో భరతాగమే" (సం. అభినయ. 390 శ్లో.)

## సందంశహస్తలక్షణము

సీ. ఎలమిఁ దర్జనిమధ్యమములను జేర్చి
గరిమ నంగుష్ఠమునఁ గూర్చి కడమవ్రేళ్ళు
సాఁచినది సందశం బని జగతి వెలయు
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 51

## సందంశహస్తవినియోగము

సీ. చేరి ముత్యములకు వారిబిందువులకుఁ
గొమరొప్ప రుద్రాక్షగుళికలకును
గరిమ మల్లెలకును గర్పూరమునకును
మఱి పగడములకు మాత్రలకును
సొమ్ము వెట్టుటకును సోఁదిది వాసనచూడ
పావనంబులకు దేవతార్చనలకు
వైదూర్యమునకును బరఁగఁ గెంపులకును
ముద్ర వేయుటకును ముదము మీఱ

గీ. నొసరఁ జెలియలు మడుపుల నొసఁగుటకును
నరయ సందంశహస్తంబు ననువుగాను
నిన్నితావుల వర్తించి చెన్ను మీఱు
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 52

## ముకుళహస్తలక్షణము

గీ. ఒనరఁగా నైదువ్రేళ్లను నొకటిగాను
గూర్చినంతనె ముకుళమై గొమరుమీఱు
సరసగుణహార! శ్రీరంగపురవిహార!
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 53

## ముకుళహస్తవినియోగము

సీ. పరఁగ దానములకుఁ బ్రాణంబు లనుటకు
వేమాఱు సొలపున విరహమునకుఁ
బరువడి మదనునిపంచబాణములకు
మఱి భోజనమునకు మౌనమునకుఁ

దామర మొగ్గకుఁ దగవుగా [1] నై దన
శాకపాకములను జెలఁగి యిడను
గదళిపుష్పమునకుఁ గలువల మొగ్గకు
మెచ్చి ధనము చాల నిచ్చుటకును

గీ. ప్రేమ మీఱఁగ ముద్దులు వెట్టుటకును
దగవుగా నిన్ని తావులఁ దనరుచుండు
ముకుళహస్తంబు నిలలోన, మోహనాంగ!
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 54

## తామ్రచూడహస్తలక్షణము

గీ. అనువు మీఱఁగ ముకుళహస్తంబునందుఁ
దర్జనిక వ్రేలు వంచినఁ దగవుగాను
దామ్రచూడం బటంచనఁ దనరుచుండు
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 55

## తామ్రచూడహస్తవినియోగము

గీ. ఒనర వాయసమునకును నొంటె కమరుఁ
గుక్కుటము మఱాపికంబును గొంగ యనను
జెల్లు నిదె తామ్రచూడంబు చెలువు మీఱ
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 56

## త్రిశూలహస్తలక్షణము

క. పరువడిఁ జిటికెనవ్రేలును
గుఱుచగ నంగుష్ఠ మెలమిఁ గూర్చుక మిగులన్
మఱి మఱాడువ్రేళ్లు సాఁచిన
గరిమఁ ద్రిశూలంబు నయ్యెఁ గస్తురిరంగా! 57

1. "ఆత్మని ప్రాణనిర్దేశే పక్వసస్యాదినిరూపణే" (సం. అభి.)

## త్రిశూలహస్తవినియోగము

క. ఎలమిని ముల్లోకములకుఁ
బలుమఱు మూఁటికిని బిల్వపత్రంబునకున్
వెలయఁ ద్రిశూలంబునకును
గలిగెఁ ద్రిశూలంబు ధరను గస్తూరిరంగా! 58

మాలిని

సరసిజదళనేత్రా! సజ్జనస్తోత్రపాత్రా!
హరిహయనుతపాదా! యచ్యుతా! లోకనాథా!
కలికలుషవిదారా! కామినీచిత్తచోరా!
పరిహృదయవిహారా! పాహి శ్రీరంగశౌరీ! 59

గద్యము

ఇది, శ్రీవాసుదేవ కరుణాకటాక్షవీక్షణాకలితశృంగారరసప్రధాన సంగీత సాహిత్య భరతశాస్త్రవిద్యాపారంగత శ్రీమద్యాజ్ఞవల్క్యాచార్య పదారవింద మకరందబిందుసందోహపాన తుందిలమిళిందీభూతనిజాంతరంగ శ్రీమృత్యుంజయార్య పుత్ర కాశ్యపగోత్రపవిత్ర సుజనవిధేయ లింగముగుంట మాతృభూతనామధేయ ప్రణీతంబయిన యభినయదర్పణం బను మహాప్రబంధంబునందు నసంయుతాఖ్యాష్టావింశతిహస్తంబులను బరగుచున్నయది ద్వితీయాశ్వాసము. 60



# అభినయదర్పణము

## తృతీయాశ్వాసము

—★—

### సంయుతము

క. శ్రీవల్లభ ! నాపాలిటి
దైవము నీవే యటంచు స్థిరముగ మదిలో
నేవేళను భజియించెదఁ
గావుము ! నను వరసుభాంగ ! కస్తురిరంగా ! 1

క. చెలువుగ సంయుతహస్తం
బలరఁగ మఱి లక్ష్యలక్షణంబుల మిగులం
దెలియఁగ నిదె వివరించెదఁ
గలుషాపహ ! దనుజభంగ ! కస్తురిరంగా ! 2

వ. ఇట్లు మఱియును, నంజలిహస్తంబును, బుష్పపుటహస్తంబును, జతురస్రకంబును, స్వస్తికంబును, గర్తరీస్వస్తికంబును, డోలహస్తంబును, గపోతహస్తంబును, గర్కటహస్తంబును, నవహిత్థంబును, నుత్థానవంచితంబులును, గలశహస్తంబును, నుత్సంగశివలింగహస్తంబులును, నాగబంధహస్తంబును, శకటహస్తంబును, శంఖచక్రహస్తంబులును, సంపుటహస్తంబును, బాశకీలకహస్తంబులును, మత్స్యకూర్మ వరాహహస్తంబులును, సింహహస్తంబును, గరుడహస్తంబును, ఖట్వాభేరుండహస్తంబులును నీ సప్తవింశతియు సంయుతాఖ్యహస్తంబులై పరఁగుచుండు, నంత 3

### అంజలీహస్తలక్షణము ; వినియోగము

క. రెండుపతాకంబులు మఱి
దండిగఁ గరతలముఁ జేర్చి దండము వెట్టన్
మొందుగ వదనమున కా
ఖండలనుత ! యంజలిదియె గస్తురిరంగా ! 4

## [1] పుష్పపుటహస్తలక్షణము

క. మఱి సర్పశీర్షహస్తము
వెరవుగఁ గరయుగముఁ జేరి వెలిగా మిగులన్
ఉరమున కెదురుగఁ బట్టిన
గరిమను నిది పుష్పపుటము గస్తురిరంగా! 5

## పుష్పపుటహస్తవినియోగము

క. భానుని కర్ఘ్యము లియ్యను
బూనికగా మంత్రపుష్పపుష్పాంజలులన్
మానుగ నీరాజనమునఁ
గానుకకును బుష్పపుటమె గస్తురిరంగా! 6

## [2] చతురస్రకహస్తవినియోగము

క. తురగము నెక్కినవానికి
మురహరి! పట్టాభిషేకమునకును మిగులన్
మఱి ముఖచామరమునకును
గరిమను జతురస్రకంబె కస్తురిరంగా! 7

## స్వస్తికహస్తలక్షణము; వినియోగము

క. పరఁగఁ బతాకంబుల నిరు
కరములు నదె చేర్చి నోరు గట్టిగ మూయన్
నిరతము స్వస్తికహస్తము
గరిమను వినయంబునకును గస్తురిరంగా! 8

---

1. "సంక్లిష్టౌ సర్పశీర్షౌ చేత్ భవేత్పుష్పపుటః కరః" "సర్పశీర్షస్య పార్శ్వే త్వపరస్సర్పశీర్షకః। ధృతః పుష్పపుటాఖ్యస్స్యా దధీశః కిన్నరేశ్వరః" అను నీరెండు లక్షణములకంటెను నిది భిన్నముగా నగపడును.

2. "చతురస్రస్మృతౌ వక్షః పురోగౌ కటకాముఖౌ" (సం. అభి. 478 శ్లో). అనునది చతురస్ర లక్షణము.

## కర్తరీస్వస్తికహస్తలక్షణము

చ. సరగను గర్తరీముఖము సారెకు రెండుకరంబులందునున్
మఱి మణిబంధమందు నదె మాటికి మన్ననతోడఁ జేర్చి తా
విరళముగాను బట్టు నది వేమఱు గర్తరిస్వస్తికం బనన్
మురహరి! ధాత్రిలో వెలయు, మోహన! కస్తురిరంగనాయకా! 9

## వినియోగము

గీ. పక్షులకుఁ దారలకు మఱి వృక్షములకు
మొనసి పర్వతములకు సమూహములకు
సారె కిటు సెల్లుఁ గర్తరీస్వస్తికంబు
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 10

## డోలాహస్తలక్షణము [1]

గీ. తొడరి సపతాకహస్తంబు నడుమునందు
రెండుకరములఁ బట్టిన మొందుగాను
డోలహస్తం బనంబడు మేలు దనర
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 11

## వినియోగము

క. అల [2]పేరణికిని గడునై
మెలఁగిన నాట్యంబునకును మేదినిలోనం
జెలఁగును డోలాహస్తము
గలుషాపహ! దనుజభంగ! కస్తురిరంగా! 12

## కపోతహస్తలక్షణము

గీ. చేతు లటు కట్టుకొనను గపోత మాను
సరగ భక్తిని గేశవు సన్నుతింపఁ
బొంకముగఁ జెల్లు మఱియు గపోత మిఁపుడు
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 13

---

1. "పతాకావూరుదేశస్థౌ డోలాహస్తోఽయ ముచ్యతే" అని లక్షణాంతరమును దీనికిఁ గలదు,
2. పేరణి—భాండముమీఁద జరుపునృత్యము.

## కర్కటహస్తలక్షణము

గీ. వెలయఁగను రెండుకరముల వ్రేళ్ళు గ్రుచ్చి
యెదురుకొన సూపి క్రొమ్ముగ నెగయఁబట్టఁ
గర్కటకహస్త మనఁజను ఘనత కెక్క
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 14

## వినియోగము

గీ. మొనసి చూడంగ మఱియు సమూహమునకుఁ
గలుఁగుచీకటికి నిల నింక గృహమునకు
ధరను గర్కటహస్తంబు దనరుచుండు
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 15

## అవహిత్థహస్తలక్షణము

క. మఱి పద్మకోశహస్తము
నిరవుగఁ గరయుగమునందు నెదురుగఁ బట్టం
బరువడి నవహిత్థం బగుఁ
గరివరదా! దనుజభంగ! కస్తురిరంగా! 16

## వినియోగము

క. ఎలమిని శృంగారమునకు
నెలఁతలకుచములకు మిగులనీటుకు వగ న్
అలయవహిత్థము సెల్లును
గలుషాపహ! దనుజభంగ! కస్తురిరంగా! 17

## ఉత్థానవంచితహస్తలక్షణము ; వినియోగము

గీ. పొదలఁ ద్రిపతాకహస్తంబు భుజమునందు
రెండుకరములఁ బట్టిన నొందుగాను
నదియె యుత్థానవంచిత మగును [1]హరికి
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 18

---

1. "త్రిపతాకా వంసదేశగతా వుత్థానవంచితః। విష్ణోరభినయే స్తమ్భభావనాయాం బుధోదితః।
ఉత్థానవంచితాభిఖ్య స్సర్వనాట్యేషు కీర్తితః॥" (సం. అభి. ౨౭౭ శ్లో).

## కలశహస్తలక్షణము

క. విను మర్ధచంద్రహస్తము
వినుత! కరయుగమునందు నెదురెదురుగ నుం
గొనవ్రేళ్ళు వంచిపట్టిన
ఘనకలశకరంబు నదియె కస్తురిరంగా! 19

## వినియోగము

చ. చెలువుగఁ బూర్ణకుంభమును శ్రీధర! యింకను నారికేళముం
బలుమఱు గొప్పగుడ్లనను బాగుగ గుమ్మడికాయఁ జూపనున్
ఎలమిని గుత్తికికి మిగుల నింపుగ నీకలశంపుహస్తమే
చెలఁగును వాసుదేవ! భవ[illegible] ! కస్తురిరంగనాయకా! 20

## ఉత్సంగహస్తలక్షణము

గీ. మొనసి మృగశీర్షహస్తముల్ ముందు వెనుకఁ
బరఁగ మణిబంధములఁ జేర్చి పట్టియున్న
నొనర నుత్సంగహస్తమై ఘనత కెక్కు-
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 21

## వినియోగము

గీ. ఎనసి పితృవందనమునకు నింపు మీఱఁ
బరగ నాలింగనమునకు సన్నుతాంగ!
చెల్లు నుత్సంగహస్తంబు చెన్ను మీఱ
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 22

## శివలింగహస్తలక్షణము ; వినియోగము

చ. చెలువుగ దక్షిణంబయినచేతను నాశిఖరంబుఁ బట్టియుం
బలుమఱు వామహస్తమున బాగుగ బట్టియు నర్ధచంద్రము
న్నెలమిఁ రెండుఁ జేర్చినను నింపుగ నాశివలింగహస్తమై
యలరును లింగభావనకు నంతటఁ గస్తురిరంగనాయకా! 23

## నాగబంధహస్తలక్షణము

ఉ. వేమఱు సర్పశీర్షమును వేడ్కను రెండుకరంబులందునున్
ప్రేమ నధోముఖంబుగను పెంపుగ నామణిబంధమందునున్
సామిగఁ జేర్చి వక్షమున సారెకుఁ బట్టిన హస్తమెప్పుడున్
నామము నాగబంధ మఘనాశక! కస్తురిరంగనాయకా! 24

## వినియోగము

గీ. వినుము! పొదరిండ్లకును సర్ప మెనయుటకును
ధర నథర్వంపువేదమంత్రంబునకును
నాగబంధంబు సెల్లును నయముగాను
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 25

## శకటహస్తలక్షణము

క. ఇల భ్రమరాస్త్రము లురమునఁ
బలుమఱు గరయుగమునందుఁ బట్టుక వెలిగా
నలయంగుళులును జాఁచినఁ
గలిమలహా! శకట మగును గస్తురిరంగా! 26

## వినియోగము

గీ. రమ్యముగఁ జూడ నిలలోన రాక్షసులకుఁ
బరఁగ సింహంబునకు బహుభయమునకును
జెలఁగి శకటంబు హస్తంబు సెల్లు జగతి
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 27

## శంఖహస్తలక్షణము; వినియోగము

గీ. ఎనసి యాసర్పశీర్షంబు నెడమచేతఁ
బరఁగఁ గుడిచేత శిఖరంబుఁ బట్టి గూర్ప
శంఖహస్తంబు నగు నది శంఖమునకె
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 28

## చక్రహస్తలక్షణము ; వినియోగము

చ. వరుసగ నర్ధచంద్రములు నైపుణగఁ బట్టుక రెండుచేతులం
బరువడి నడ్డదిడ్డముగ బాగుగఁ జేతులు మూసి పట్టుచో
నిరవుగఁ జక్రహస్తమగు నింపుగఁ జక్రము సూపఁ జెల్లునో
మురహర ! వాసుదేవ ! విను, మోహన ! కస్తురిరంగనాయకా ! 29

## సంపుటహస్తలక్షణము ; వినియోగము

క. ఇరుకరపుసర్పశీర్షము
మురహారి ! కరతలము లడ్డముగ మూసినచో
సరవిని సంపుటహస్తము
గరిమను సంపుటమునకును గస్తురిరంగా ! 30

## పాశహస్తలక్షణము

చ. పరఁగిన సూచిహస్తములు బాగుగఁ బట్టుక రెండుచేతులన్
వరుసగఁ దర్జనీలు నదె వంచుక వ్రేళ్లును రెంప నేర్చి తా
గరిమను [1] నూర్ధ్వధోముఖముఁగా మఱియున్ మెలిగాను బట్టినన్
నిరతము పాశహస్తమగు నిశ్చయము గస్తురిరంగనాయకా ! 31

## వినియోగము

గీ. పరఁగ నన్యోన్యకలహపాశంబులకును
నెలమి ద్వేషంబునకు మఱి గొలుసునకును
ననువుగా బాశహస్తమై యలరుచుండు
రాక్షసవిరామ ! కస్తురిరంగధామ ! 32

## కీలకహస్తలక్షణము

చ. అలమృగశీర్షహస్తములు నంతట నూర్ధ్వ మధోముఖంబుఁ గా
నెలమిఁ గనిష్ఠికాంగుళిని నించుక వంచియు రెండుఁ గూర్చియుఁ
మెలిగను బట్టియున్న నది మేదినిలోనను గీలకం బగుఁ
జలరుహనేత్ర ! భక్తజనసన్నుత ! కస్తురిరంగనాయకా ! 33

1. 'ఊర్ధ్వాధోముఖము'లని యుండఁదగును,

## వినియోగము

క. చెలువుగ స్నేహాలను మఱి
పలుమఱు మగఁ డాలిఁ జెట్టవట్టను మిగులన్
నిరతం బనుకూలతకును
గరిమను గీలకము వచ్చుఁ గస్తురిరంగా! 34

## మత్స్యహస్తలక్షణము ; వినియోగము

గీ. మఱి పతాకంపుఁగరముపైఁ గరముఁ జేర్చి
సరగ నంగుష్ఠములు రెండుఁ జాఁచియున్న
మత్స్యహస్తంబు నది మఱి మత్స్యమునకె
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 35

## కూర్మహస్తలక్షణము

గీ. నెగడుమత్స్యంబునందుఁ గనిష్ఠికలను
రెండువ్రేళ్లను జాఁచిన మొండుగాను
గూర్మహస్తంబు నగు నది గూర్మమునకె
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 36

## వరాహహస్తలక్షణము

చ. అరుదుగ [1] దక్షిణంబునను నామృగశీర్షముఁ బట్టి యంతటన్
వరుసఁ బతాకహస్తమును వామకరంబునఁ బట్టి గూర్చినన్
మఱియు వరాహహస్త మగు మాధవ! చెల్లును సూకరంబుకే
మురహరి! వాసుదేవ! యఘమోచన! కస్తురిరంగనాయకా! 37

## సింహహస్తలక్షణము

చ. ఎనసినపద్మహస్తములు నింపుగ రెండుకరంబులందును
దనరఁ గనిష్ఠికంబు లదె తథ్యము వంచుక ముందు వెన్కగా
ఘనమణిబంధమందు మఱి గ్రుక్కనఁ జేర్చిన సింహహస్త మా
వనరుహనేత్ర! కేసరికి వచ్చును గస్తురిరంగనాయకా! 38

---

1. దక్షిణము = దక్షిణహస్తము.

## గరుడహస్తలక్షణము ; వినియోగము

చ. తడయక యర్ధచంద్రములు ధాటిగ రెండుకరంబులందునుం
దొడిఁబడి ముందు వెన్క గను దోయరుహానన ! చేర్చి యంతటన్
విడువక యంగుళిక్ మెలిక వేసిన నాగరుడంపుహస్తమై
యడరును వైనతేయునికి నచ్యుత ! కస్తురిరంగనాయకా ! 39

## ఖట్వాహస్తలక్షణము

గీ. ఎలమిఁ జతురంపుహస్తంబు లెదురెదురు గఁ
గూర్చి తర్జనియుగము నంగుష్ఠయుగము
చాఁప నది ఖట్వాహస్తమై చాలియుండు
రాక్షసవిరామ ! కస్తురిరంగధామ ! 40

## వినియోగము

క. మంచానికి నుయ్యాలకు
నెంచఁగఁ దగువారిధికిని నీఖట్వాకరం
బంచితముగ వచ్చును మఱి
కంచిపురీవరదరాజ ! కస్తురిరంగా ! 41

## భేరుండహస్తలక్షణము

గీ. మఱి కపిత్థయుగంబును గరములందుఁ
బట్టి మణిబంధములుఁ జేర్ప దిట్టముగను
గండభేరుండహస్తమై ఘనత కెక్కు
రాక్షసవిరామ ! కస్తురిరంగధామ ! 42

## దేవతాహస్తలక్షణము

చ. వెరవుగ ధాత యీశ్వరుడు విష్ణువు భారతి లక్ష్మి పార్వతుల్
పరఁగ వినాయకుండు మఱి బాగుగ షణ్ముఖుఁ డంగజుండునుం
బరఁగఁగ దిక్పతుల్ మిగులఁ బంకజనాభ ! దశావతారముల్
స్థిరముగ హస్తభావములు దెల్పెదఁ గస్తురిరంగనాయకా ! 43

## బ్రహ్మదేవహస్తలక్షణము

క. కుడిచేతను హంసాస్యము
గడువడిఁ జతురంబు నెడమకరమునఁ బట్టం
బుడమిని విధిహస్తం బయి
గడి దేఱును గలుషభంగ! కస్తురిరంగా! 44

## ఈశ్వరహస్తలక్షణము

చ. మొనసిన శంఖహస్తమును ముందఱఁ బట్టుక వామపార్శ్వమున్
ఘన త్రిపతాకహస్తమును గట్టిగ దక్షిణహస్తమందునన్
బనివడ వామహస్తమున బాగుగ నామృగశీర్షహస్తము
న్నెనయఁగఁ బట్టి చూపినను నీశ్వరహస్తమె రంగనాయకా! 45

## విష్ణుహస్తలక్షణము

గీ. ఒనరఁ ద్రిపతాకములు శిరయుగమునందుఁ
బరఁగ భుజముల కెఱపఁగాఁ బట్టియున్న
మెఱసి శ్రీవిష్ణుహస్తమై మేలు దనరు
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 46

## సరస్వతీహస్తలక్షణము

క. వామకరంబున హంసము
వేమఱు గుడిచేత సూచి వెలయఁగఁ బట్టం
బ్రేమను భారతిహస్తము
గాముని గన్నయ్య! వినుము కస్తురిరంగా! 47

## లక్ష్మీహస్తలక్షణము

క. మాపక యుభయకరంబులఁ
బూని కపిత్థంపుఁగరము భుజముల కెఱవన్
దా నిటు వట్టిన శ్రీ యై
గానంబడు ఖగతురంగ! కస్తురిరంగా! 48

## పార్వతీహస్తలక్షణము

గీ. చెలువుగను నర్ధచంద్రంపుఁ జేతియందుఁ
బరఁగ వరదాభయంబులు పట్టియున్నఁ
బార్వతీహస్తమై చాల బాగు మీఱు
రాక్షసవిరామ ! కస్తురిరంగధామ ! 49

## వినాయకహస్తలక్షణము

గీ. మఱి కపిత్థంబులును రెండుఁ గరములందు
నుదరమున కెదురుగఁ బట్ట నొప్పుగాను
నిల వినాయకహస్తమై యేపు మీఱు
రాక్షసవిరామ ! కస్తురిరంగధామ ! 50

## షణ్ముఖహస్తలక్షణము

గీ. [1] సొరిది వామకరంబు త్రిశూలమునను
జేరి దక్షిణహస్తంబు శిఖరమునను
సరసి పట్టిన షణ్ముఖహస్త మగును
రాక్షసవిరామ ! కస్తురిరంగధామ ! 51

గీ. పొదల నర్ధపతాకంబు భుజము కెగువ
రెండుకరములఁ బట్టిన మొందుగాను
గార్తికేయునిహస్తమై ఘనత కెక్కు—
రాక్షసవిరామ ! కస్తురిరంగధామ ! 52

## మన్మథహస్తలక్షణము

గీ. శిఖరమును వామకరమునఁ జెన్నుమీఱ
దనరుకటకాముఖంబును దక్షిణంపుఁ
గరమునను బట్ట మదనునికరము గ్రూర
రాక్షసవిరామ ! కస్తురిరంగధామ ! 53

---

1. ఈలక్షణమే సం. అభినయదర్పణమందును గలదు. "వామేకరే త్రిశూలంచ, శిఖరం దక్షిణే కరే। ఊర్ధ్వం గతే షణ్ముఖస్య కర ఇత్యుచ్యతే బుధైః" (590 శ్లో).

## ఇంద్రహస్తలక్షణము

గీ. అరయఁ ద్రిపతాకములు రెండుఁ గరములందు
ముందు వెనుకగఁ బట్టిన నింద్రుఁ డగును
సరసగుణహార! శ్రీరంగపురవిహార!
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 54

## అగ్నిహస్తలక్షణము

గీ. అలరు త్రిపతాక దక్షిణహస్తమునను
గరిమ లాంగూలమును వామకరమునందు
బట్ట నది యగ్నిహస్తమై పరఁగుచుండు
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 55

## యమహస్తలక్షణము

గీ. వామపార్శ్వానఁ బాశ మావగను బట్టి
దక్షిణకరంబునను సూచి దనరియున్న
వెలయు యమహస్తమై చాల వేడ్క దనరు
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 56

## నైరృతిహస్తలక్షణము

గీ. అలపతాకంబు దక్షిణహస్తమునను
నెలమిగాఁ బద్మకోశంబు నెలమి వామ
కరమునను బట్ట నైరృతి ఘనత కెక్కు
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 57

## వరుణహస్తలక్షణము

గీ. ఒనర సపతాకములు గరయుగమునందుఁ
బట్టి శిఖరంబు మఱియును బట్టి చూపఁ
జెలఁగి వారుణహస్తమై వెలయుచుండు
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 58

## వాయుహస్తలక్షణము

గీ. అర్ధచంద్రంబు దక్షిణహస్తమునను
నెనయ సర్ధపతాకంబు నెలమి వామ
హస్తమునఁ బట్టఁగా వాయుహస్త మగును
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 59

## కుబేరహస్తలక్షణము

గీ. దక్షిణకరంబునఁ ముష్టి దనరుచుండ
వైపుగను బద్మకోశంబు వామహస్త
మునను బట్టిన ధనదుఁడై ఘనత కెక్కు
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 60

## [1] ఈశానహస్తలక్షణము

చ. మొనసినశంఖహస్తమును ముందఱఁ బట్టుక వామపార్శ్వమున్
ఘనత్రిపతాకహస్తమును గట్టిగ దక్షిణహస్తమందునం
బనివడ వామహస్తమున బాగుగ నామృగశీర్షహస్తము
న్ననయఁగఁ బట్టి చూపినను నీశ్వరహస్తము రంగనాయకా! 61

## —: దశావతారహస్తలక్షణములు :—

## మత్స్యావతారహస్తలక్షణము

గీ. ఎలమి మత్స్యకరమువట్టి చెలువు మీఱఁ
బూని త్రిపతాకములు రెండు భుజములందు
జాఱఁబట్టిన మత్స్యావతార మౌను
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 62

## కూర్మావతారహస్తలక్షణము

గీ. మెఱయఁగాఁ గూర్మహస్తంబు మేల్మిఁ బట్టి
పొదవి త్రిపతాకములు రెండు భుజములందు
జాఱఁబట్టినఁ గూర్మావతార మౌను
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 63

---

1. సం. అభి. దర్పణమందు దిక్పాలురఁ జెప్పుసందర్భమున నిది వదలఁబడినది.

## వరాహావతారహస్తలక్షణము

చ. ఎనయ వరాహహస్తమును నేర్పుగఁ బట్టుక వేడ్క మీఱఁగా
ఘనముగ నర్ధచంద్రములు గట్టిగ నాకటియందు మిక్కిలిన్
బనుపడ రెండుచేతులను బట్టనదే [1] వరహావతార మా
వనజదళాయతాక్ష! విను వైపుగఁ గస్తురిరంగనాయకా! 64

## నరసింహావతారహస్తలక్షణము

గీ. సింహముఖహస్తమును జూపి చెలువు మీఱఁ
బరఁగఁ ద్రిపతాకములు రెండుఁ బట్టియున్నఁ
బొనర నరహరియవతారమునకుఁ జెల్లు
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 65

## వామనావతారలక్షణము

ఉ. వామకరంబు ముష్టిఁ గొని వైపుగ ఛత్రముఁ జూపఁ బట్టుచున్
వేమఱు దక్షిణంబునను వేడ్కఁగఁ గ్రిందికి ముష్టిఁ జూపుటల్
ప్రేమను వామనుం డగుచుఁ బొంపు వహించును ధాత్రిలోన నో
సామజపాల! దైత్యరిపుఖండన! కస్తురిరంగనాయకా! 66

## పరశురామావతారహస్తలక్షణము

గీ. గరిమ నదె వామకరమును గటిని నుంచి
దక్షిణకరంబు నర్ధపతాకమునను
బట్ట భృగురాముఁ డనుఖ్యాతిఁ బరఁగుచుండు
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 67

## శ్రీరామావతారహస్తలక్షణము

గీ. శిఖరమును వామకరమునఁ జెలువు మీఱ
నలకపిత్థము దక్షిణహస్తమునను
నెనసి పట్టిన శ్రీరాముఁ డనఁగఁ బరఁగు
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 68

---

1. వరాహావతార మనుటయే సాధువు.

## బలరామావతారహస్తలక్షణము

క. కుడిచేతను సపతాకము
నెడమకరంబునను ముష్టి యొనయఁగఁ బట్టం
బుడమిని బలరాముం డయి
గడిదేఱును జగతిలోనఁ గస్తురిరంగా! 69

## కృష్ణావతారహస్త[1](లక్షణము?)

గీ. ఘనత మీఱఁగ మఱి వేణుగానమునను
జూపఁ గృష్ణావతార మై సొబగు మీఱు
సరసగుణహార! శ్రీరంగపురవిహార!
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 70

## కల్క్యవతారహస్తలక్షణము

గీ. వెలయు సపతాకమును నొత్తి గిలనుబట్టి
యిరుకరంబులఁ ద్రిపతాక మొనయఁ బట్టఁ
జెలఁగి కల్క్యవతార మై చెలువు మీఱు
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 71

## సూర్యహస్తలక్షణము

గీ. పరఁగ నదె సూచిహస్తంబు బాగు మీఱ
నిరుకరంబుల భుజముల కెగువఁ బట్ట
ధరను మార్తండహస్తంబు మెఱయుచుండు
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 72

## చంద్రహస్తలక్షణము

గీ. కూర్మి వామంబునను బద్మకోశ మలర
మొనసి కుడిచేత మఱి సింహముఖము బట్ట
ధర సుధాకరహస్త మై దనరుచుండు
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 73

---

1. "మృగశీర్షేతు హస్తాభ్యామన్యోన్యాభిముఖీకృతే । అంసోప కంఠే కృష్ణస్య హస్తఇత్యభిధీయతే." సం. అభి.

## బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రాది జాతులకు భావలక్షణము

క. ఎలమిని బ్రహ్మక్షత్రియ
సలలిత సద్వైశ్యశూద్రజాతులు దెలియం
బలుమఱు భావము దెల్పెదఁ
గలుషాపహా! దనుజభంగ! కస్తురిరంగా! 74

## బ్రాహ్మణహస్తలక్షణము

క. ఒగిఁ గరయుగశిఖరంబులు
సొగసుగ నటు పట్టి యజ్ఞసూత్రముఁ జూపన్
నెగడిన బ్రాహ్మణహస్తము
ఖగవాహన! దనుజభంగ! గస్తురిరంగా! 75

## క్షత్రియహస్తలక్షణము

గీ. చేరి వామకరంబున శిఖర ముంచి
యలపతాకంబు దక్షిణహస్తమందుఁ
బట్ట క్షత్రియహస్త మై పరఁగుచుండు
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 76

## వైశ్యహస్తలక్షణము

గీ. మెఱియ హంసాస్యమును వామకరమునందుఁ
దనర సందర్శహస్తంబు దక్షిణంపుఁ
గరమునను బట్ట వైశ్యుఁడై ఘనతకెక్కు-
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 77

## శూద్రహస్తలక్షణము

క. అల వామంబున శిఖరము
మెలఁగఁగఁ గుడిచేతఁ బట్ట మృగశీర్షమునుం
దెలివొందు శూద్రహస్తము
గలుషాపహా! దనుజభంగ! కస్తురిరంగా! 78

## బాంధవహస్తలక్షణము

చ. నిరతము దంపతుల్ మఱియు నిక్కము భార్యకుఁ దల్లితండ్రికిన్
న్నిరవుగ మామ యల్లునికి నింపుగ బావకుఁ దోడికోడలున్
సరగను నన్నదమ్ములకు సాతికిఁ గోడలి కింకఁ బుత్త్రికం
బరఁగను నత్త పిన్నిటికి భావముఁ దెల్పెద రంగనాయకా! 79

## దంపతిహస్తలక్షణము

క. కుడిచేతను మృగశీర్షము
నిడి శిఖరము నెడమచేత నేపుగఁ బట్టం
దడయక దంపతిహస్తము
గడువడి శోభిల్లుచుండుఁ గస్తురిరంగా! 80

## భార్యహస్తలక్షణము

ఉ. వామకరంబునందు మఱి వారిజలోచన! హంసహస్తమున్
వేమఱుఁ బట్టి కంఠమున వేడ్కగ దక్షిణహస్తమందునన్
సామిగ సందశంబు నిడి సారెకు నాభికిఁ జాఁచి పట్టినం
బ్రేమను భార్యహస్త మది యింపుగఁ గస్తురిరంగనాయకా! 81

## మాతృహస్తలక్షణము

చ. హరిహరి! యర్ధచంద్రమును నంతట వామకరంబునందునం
గరిమను బట్టి కుక్షి నిడి గట్టిగ నాకుడిచేత సందశం
బిరవుగఁ బట్టి చుట్టి మఱి యింపుగ నాభిని జాఁచబట్టినన్
వరుసగ మాతృహస్త మగు వైపుగఁ గస్తురిరంగనాయకా! 82

## పితృహస్తలక్షణము

క. మును మాతృహస్తమందున
ననువగు శిఖరంబు దక్షిణంబునయందుం
బనువడఁ బట్టిన నది మఱి
ఘనముగఁ బితృహస్త మగును గస్తురిరంగా! 83

## మామగారిహస్తలక్షణము

క. అలభార్యహస్తమందునఁ
జెలువుగ దక్షిణకరాన శిఖరము వట్ట
న్నిలమామహస్త మగు నది
కలుషాపహా! దనుజభంగ! కస్తురిరంగా! 84

## అల్లునిహస్తలక్షణము

చ. పరఁగను బద్మకోశమును బట్టుక వామకరంబునందునన్
మెరయఁగ దక్షిణంబునను మేల్మిని నాశిఖరంబుఁ బట్టినన్
సరసిజనేత్ర చెల్లు నది సారెకు నల్లునిహస్త మంచు నో
మురహారి! వాసుదేవ! యఘమోచన! కస్తురిరంగనాయకా! 85

## బావగారిహస్తలక్షణము

గీ. మఱియు శిఖరంబునందు వామకర ముంచి
మొనసి కుడిచేతఁ గర్తరీముఖముఁ బట్టఁ
బరఁగ నలబావహస్తమై ఫరిఢవిల్లు
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 86

## తోడికోడలిహస్తలక్షణము

చ. తగవుగ సర్పశీర్షమును దక్షిణహస్తము సాఁచి పట్టుచు
న్నగడినవామహస్తమున నేర్పున నాశిఖరంబుఁ బట్టినం
బొగడఁగఁ దోడికోడలికిఁ బొంకముగా మఱి సెల్లు హస్త మో
నగధర! వాసుదేవ! యదునందన! కస్తురిరంగనాయకా! 87

## అన్నహస్తలక్షణము

గీ. మెరయు శిఖరంబు నావామకరమునందుఁ
దనర సర్పశీర్షంబు దక్షిణంపు
హస్తమునఁ బట్ట నన్నకు నగును జుమ్ము
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 88

## తమ్మునిహస్తలక్షణము

గీ. అన్నహస్తంబునందును జెప్ప మీఱ
దక్షిణకరంబునను ద్రిపతాక మమర
నరసి పట్టినఁ దమ్మునిహస్త మగును
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 89

## సవతిహస్తలక్షణము

గీ. పాశహస్తంబు ముందుగాఁ బట్టి చూపి
మొనసి కుడిచేతఁ గర్తరీముఖము బట్ట
సవతిహస్తంబ దందురు జగతిలోన
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 90

## కోడలిహస్తలక్షణము

క. వామకరంబున శిఖరము
దామోదర! హంసకరము దక్షిణపాణిం
బ్రేమను బట్టినఁ గోడలు
కాముని గన్నయ్య! వినుము! కస్తురిరంగా! 91

## పుత్రహస్తలక్షణము

క. కుడిచేత సందశంబును
గడుపున జాలంగఁ బట్టి గరిమను శిఖరం
బెడమకరంబునఁ బట్టినఁ
గడువడి బుత్రాఖ్యకరము గస్తురిరంగా! 92

## అత్తగారిహస్తలక్షణము

గీ. అరయ మృగశీర్షమున వామకరముఁ జూపి
పద్మకోశముఁ గుడిచేతఁ బట్టియున్న
మేలిమిని నత్తహస్త మై మెలఁగుచుండు
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 93

## పెనిమిటిహస్తలక్షణము

గీ. ఉభయకరముల హంసాస్య మొనర గళము
నందుఁ బట్టుక, దక్షిణహస్తమందు
శిఖరమును జూప మగనికె చెల్లు ధరను
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 94

## ఉదయాస్తమయమధ్యాహ్నములకు హస్తలక్షణము

గీ. కోరి యుదయంబునకుఁ బద్మకోశ మొప్పు
నస్తమయమునకు ముకుళహస్త మెనయుఁ
బరఁగ మధ్యాహ్నమున కంచకరముఁ జెల్లు
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 95

## షడృతువులకుహస్తలక్షణము

సీ. సరవి మీఱఁగను వసంతకాలమునకు
నను వుగా లాంగూలహస్త మొప్పు
వాలాయమున గ్రీష్మకాలంబునకు నదె
మృగశీర్షహస్తంబు మేలు దనరు
వర్షకాలమునకు వైపుగా మఱి చూడ
సందంశహస్తంబు పొందియుండు
తగవు మీఱఁగ శరత్కాలమునకు నింక
శుకతుండహస్తంబు సొంపు మీఱు

గీ. సలరు హేమంతమునకును హంసకరము
పరఁగ శిశిరంబునకు నొప్పుఁ బద్మకరము
నిట్లు షడృతుభావంబు లెనసియుండు
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 96

## నవరసహస్తలక్షణము

సీ. శృంగారమునకును జెల్లుఁ బద్మకరంబు,
నగువీరరసమున కర్ధచంద్ర
కరము, నాకరుణకు ఘనముకుళకరంబు
నలరు లాంగూలము నద్భుతమున

హాస్యరసానకు హంసాస్య మొనయును
జేరి భయానకు శిఖర మొప్పు
రహి మీఱ బీభత్సరసమునకుం జూడ
మఱి త్రిపతాకంబు మెఱయుచుండు

గీ. తొలఁగ రౌద్రమునకు శుకతుండకరము
పరఁగ నుత్సాహమునకును బద్మకరము
సరసగుణహార ! శ్రీరంగపురవిహార !
రాక్షసవిరామ ! కస్తురిరంగధామ ! 97

## నవరత్నహస్తలక్షణము

సీ. వజ్రంబునకు మఱి వైడూర్యమునకును
సింహముఖకరంబు చెన్ను మీఱుఁ
బద్మరాగానకుఁ బరఁగ నీలానకు
సందశహస్తంబు పొందియుండు
గరిమను గోమేధికంబునకుం జూడ
నర్ధపతాకంబు నలరుచుండుఁ
బొందుగా మాణిక్యపుష్యరాగంబుల
కనువుగా లాంగూలహస్త మొప్పుఁ

గీ. సరఁగఁ బచ్చకుఁ జతురహస్తంబు నలరు
మెఱయ ముత్యంబునకు హంసకరముఁ జెల్లుఁ
దనరఁ బగడంబునకుఁ ద్రిపతాక మొనయు
రాక్షసవిరామ ! కస్తురిరంగధామ ! 98

## చంద్రకాంత సూర్యకాంతిహస్తలక్షణము

గీ. చంద్రకాంతంబునకు నర్ధచంద్రకరము
భానుకాంతంబునకు నలపద్మకోశ
హస్తమును జెల్లు ధరలోన నంబుజాక్ష !
రాక్షసవిరామ ! కస్తురిరంగధామ ! 99

## [1] నవలోహహస్తలక్షణము

సీ. చెలఁగు స్వర్ణానకుఁ జతురహస్తంబును
నదె కుందనమునకు హంసకరము
నలరజితంబున కర్ధపతాకంబుఁ
గంచుకు సింహముఖంబుఁ దనరుఁ
దామ్రమునకుఁ ద్రిపతాకహస్తంబును
నాయిత్తడికి ముకుళాఖ్య మొప్పు
దగరంబునకు నపతాకము మఱిసెల్లు
నలయినుమునకు ముష్టిహస్త మలరుఁ

గీ. గరఁగుటకుఁ బద్మకోశంబు గరిమ మీఱుఁ
బేర్మి నిల సుత్తె వట్టఁ గపిత్థకరముఁ
గంబు లీడ్వను గటకాముఖంబుఁ దనరు
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 100

## సప్తస్వరహస్తలక్షణము

సీ. సరవిని షడ్జమస్వరమునకుం జూడ
ననువుగాను మయూరహస్త మొప్పుఁ
బరఁగను నలఋషభస్వరంబునకును
సింహముఖకరంబు చెన్ను మీఱు
సారసనేత్ర! గాంధారస్వరానకు
మృగశీర్షహస్తంబు మెలఁగుచుండు
మఱియును మధ్యమస్వరమునకుఁ బద్మ
కోశహస్తంబు సెల్లును గువలయేశ!

గీ. పేర్మిఁ బంచమమునకుఁ గపిత్థ మలరు
దైవతస్వరమునకుఁ బతాక మొనరుఁ
మొగి నిషాదంబునకు సింహాముఖముఁ దనరు
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 101

---

1. అష్టలోహములతో హస్తలక్షణము చెప్పఁబడెది. ఇందు బంగారు, అపరంజి వేఱువేఱుగా గ్రహింపఁబడినవి. సీసము వదలఁబడినది.

## సప్తవారహస్తలక్షణము

సీ. భానువారమునకుఁ బద్మకరంబును
నిందువారమున కర్ధేందుకరము
నలభౌమవారాన కాత్రిపతాకంబు
సౌమ్యవారానకు సందశంబు
దనరఁగ గురువారమునకును శిఖరంబు
వరపతాకము భృగువారమునకు
మఱి ముష్టిహస్తంబు మందవారమునకుఁ
జెలు వొందు మిగులను జెన్నుమీఱు

గీ. సప్తవారములకును హస్తంబు లివియె
భావ మలరఁగఁ దెల్పితిఁ బంకజాక్ష!
సరసగుణహార! శ్రీరంగపురవిహార!
రాక్షసవిరామ! కస్తురిరంగధామ! 102

### మత్తకోకిలం

శ్రీరమారమణీ మనోహర! చిత్తజాంతకవందితా!
వారిజాసన సేవ్యపద్ద్వయ! వాంఛితార్థఫలప్రదా!
నారదస్తుతిపాత్ర! శ్రీయదునందనా! భవఖండనా!
సారసాక్ష! విభూ! శుభంకర! సత్కృపానిధి! కేశవా! 103

### గద్య

ఇది, శ్రీవాసుదేవ కరుణాకటాక్ష వీక్షణాకలితాశృంగారరసప్రధాన సంగీత సాహిత్య భరతశాస్త్రవిద్యాపారంగత శ్రీమద్యాజ్ఞవల్క్యాచార్య పదారవింద మక రందబిందుసందోహపాన తుందిల మిళిందీభూతనిజాంతరంగ శ్రీమృత్యుంజయార్య పుత్ర కాశ్యపగోత్రపవిత్ర సుజనవిధేయ లింగముగుంట మాతృభూతనామధేయ ప్రణీతం బయినయభినయదర్పణం బను మహాప్రబంధంబునందు సంయుతంబును, దేవతాహస్తంబును, బ్రహ్మక్షత్త్రియవిట్శూద్రహస్తంబును, ఋతుహస్తంబును, నవరస నవరత్న నవలోహహస్తంబును, సప్తస్వర సప్తవార హస్తంబును ననుసర్వం బును దృతీయాశ్వాసము.

## సంపూర్ణము

